# కాలస్పర్శ

వచన కవిత్వం



## కాసర్ల నరేశ్‌రావు

(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్ వారి ఆర్థిక సహకారంతో ముద్రించబడింది...)

పల్లెగా స్థిరపడడానికి
పాటగా నన్ను తడుముకుంటూ
వెళ్ళిన దృశ్యం,
యింకా నా కళ్ళ ముందునుండి
చెదరి పోలేదు-
ఇంటిముందు నుండి
ప్రవహించే నన్ను పట్టుకొని
పేడనీళ్లతో ప్రేమగా తడిపి
ముగ్గులబట్టలతో
ముద్దులపాపాయిలా
ముస్తాబు చేసిన
ఆ చల్లని పల్లెతల్లుల స్పర్శ
యింకా నన్ను వెంటాడుతూనే వుంది.
వర్షం కోసం జనమే కాదు
నేనూ ఎదురుచూసేదాన్ని
వాన చినుకుల్ని గబుక్కున మింగేసి
ఒళ్లంతా మట్టివాసనతో
గుభాళింప జేయాలని తహతహలాడేదాన్ని,
నా ఒళ్లో కూర్చొని
మన్నుని వెన్నలా తిన్న చిన్నికృష్ణులెందరో
ఇప్పుడు పెద్దపెద్ద హోదాల్లో వున్నారు-
పల్లె - పట్నంగా రూపాంతరం
చెందే క్రమంలో నా మట్టితెరల మీద
కంకర్లు, తార్లు, సిమెంటులు పోసి
నా గుండెపై బరువు పెంచారు
మనిషి ఎద్దులబండి నుండి
సైకిలై, స్కూటరై, మోటారు సైకిలై, కారై





**డా॥ కనకయ్య**
తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు,
వర్శిటీ వైస్-ప్రిన్సిపాల్ (హా మరియు మె)
తెలంగాణ విశ్వవిద్యాలయం, డిచ్‌పల్లి,
నిజామాబాద్ -503175

---

## అనుబంధాల చెలి(మి)మె

'కాలస్పర్శ' అనగా కాలాన్ని స్పర్శించేది అనే అర్థంలో ఉంది. కాలం ప్రకృతిలో భాగం. ప్రకృతిలో మానవ జీవితం గొప్పది. కాలానికి మానవుడు ఇచ్చినంత విలువ ఇతర ఏ జీవీ ఇవ్వదు. మానవ జీవన విధానాన్ని కాలం నిర్ణయిస్తుంది. అలా కాలం నిర్ణయించిన మానవునికి సంబంధించిన కొన్ని అంశాలను స్పృశించిన ఈకావ్యాన్ని చదవగానే 'పాత క్యాలెండర్' గుర్తుకు వచ్చింది. దానిలో ఎన్నో అంకెలు అలాయ్ బలాయ్ చేసుకున్నట్లే నా పాత జ్ఞాపకాలు కూడా అలాయ్ బలాయ్ చేసుకున్నాయి. ప్రతీ ఇంటిలో క్యాలండర్ ఒక సూచిక. మార్గదర్శి అని కూడా అనుకోవచ్చు. క్యాలెండరును మన యింటి మహాలక్ష్మిగా, ఆత్మీయ బంధువులా, గుడిలా, ఆశల స్వర్గంలా, క్యాలిక్‌లెటర్‌లా, గోడకు తగిలించబడిన కంప్యూటర్‌లా చిత్రించాడు. నిత్య జీవితంలో భాగంగా క్యాలండర్ అవసరతను చక్కగా వివరించగలిగారు కాసర్ల నరేశ్ రావు. 'కాలస్పర్శ'లోఎంచుకున్న కవితల్లో వస్తువు, శైలి, పాత్రలు, జీవన విధానం జీవిత సత్యాలే అయినప్పటికీ కవిత్వ పరంగా చూసినపుడు అద్భుతాలు అనిపిస్తాయి. అద్భుతాల సృజనశక్తిని కలిగిన వ్యక్తిని చూసినపుడు ఎవరికైనా ఆనందమే కలుగుతుంది. ఇలాంటి కవిని చూసిన తర్వాత నాకు కూడా అద్భుతానందమే కలిగింది. కాసర్ల నరేశ్ రావు నాకు 1994 నుండి తెలుసు. నేను బిక్కుబిక్కుమని బెదురుచూపులతో యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్‌కు వెళ్లి , పి.జి. తెలుగులో చేరినపుడు వెన్నుతట్టి ప్రోత్సాహం ఇచ్చిన ఆత్మీయ సీనియర్ తాను. ఆయనను నేనెన్నడూ మరచిపోలేదు. ఎందుకంటే ఆయనకు అక్కడ చెదరనటువంటి ఒక గుర్తింపు ఉంది. ఆయనలో ఉన్న ఆనాటి మనిషే నాకు ఈనాడు కనపడ్డాడు. గాంధీ అంటే జనాల్లో ఎలాంటి ముద్ర ఉందో, అలాంటిదే నాకు నరేశ్ రావు విషయంలో "నరేశన్న" అనే ముద్ర ఉంది.

అందుకుంటున్న దృశ్యం / ఈ జన్మకు మర్చి పోగలనా?" అనే తీపి సజీవ దృశ్యాలు జీవిత పర్యంతమూ మరచిపోలేని సంఘటనలే.

మనిషి పరిణామ క్రమంలో మానవ విలువలు పెరుగుతుంటాయే తప్ప తరగవు. అందుకే కొంతమంది వయసులో ఏదైనా తప్పుచేస్తే... 'ఏదిగావు ఆ మాత్రం తెలియదా' అని ప్రశ్నించడం మనకు సమాజంలో కనపడుతుంది. శరీరానికి ముసలి తనం రావచ్చు. కానీ మనసుకు కాదు అని చెప్పే చక్కటి కవితా చిత్రణ కొన్ని కవితల్లో గుబాళిస్తుంది. నిన్న నాది కాదనుకున్నది నేడు నాది అవుతుంది, నేడు నాది అనుకున్నది రేపు నాది కాకుండా పోతుంది. జీవితం చక్రం ఇలాంటిదే. అది గతాన్ని మరిపించి, వర్తమానాన్ని మెరిపిస్తుంది, భవిష్యత్తును శాసిస్తుంది. మనిషి జీవితం దీనికి అతీతమేమీ కాదనే సత్యాన్ని కవి చెపుతున్నాడు. "వృద్ధాప్యం అంటే, / తాను కొవ్వొత్తి అయి క్షీణించి/ ఇంటిని వెలిగించిన కాంతి, / సంసారాన్ని, సంతానాన్ని తీర్చిదిద్ద/ హరించిన తన శక్తిని, ఆరోగ్యాన్ని / తన పిల్లల్లో చూసుకునే మహాద్భాగ్యం..../ వృద్ధాప్యం అంటే బాల్యాన్ని తిరిగి పొందడం / వృద్ధాప్యం పూజించాల్సిన గురువు / వృద్ధాప్యం సేవించాల్సిన దైవం / వృద్ధాప్యం రేపటి నీ భవిష్యత్తు!... ఇన్ని ఆలోచనల పరంపరను చదివితే సహృదయులకు రోమాంచితం కావాల్సిందే. ఏపాఠకున్ని అయినా కదలించి తీరాల్సిందే.

మానవుడు ఉన్నదానితో సంతృప్తి పడటం, తనచుట్టూ ఉన్నవాళ్లు పొందే సంతోషంలో భాగంగా తనుకూడా పాలు పంచుకోటం లాంటి వాటిని జీవిత చక్రంలో జీవిత పరమార్థంగా భావించాలి. శాశ్వతం కాని సుఖ సంతోషాలు వస్తాయి, పోతాయి. ఎన్నో వసంతాలు వస్తాయి. ఎంతో ఆనందాన్ని పొందే అవకాశం ఉంటుంది. ఆ జీవన క్రమంలో ముందు తనను తాను రక్షించుకోవాలి. తర్వాత ఇతరుల క్షేమానికి ఆలోచించాలి. సమాజానికి తోచింది చేయాలి. ఈ నేపథ్యంలో తనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులను అపురూపంగా చూసుకోవాలి. చూసుకోని వారికి "ముసలితనం దుప్పట్లోంచి మిణుకు మిణుకుమనే ఆశతో / ఎదురు చూస్తున్న వృద్ధ తల్లిదండ్రుల కళ్లను చదవండి,/ వాళ్ల కన్నీళ్లను చదవండి / మనిషి మనిషి నుండి వేరుపడి / అనుబంధాల తాడును అలవోకగా తెంపుకుంటున్న / ఈ కాలానికి ఎన్ని వసంతాలు వస్తే ఏం...? అని ప్రశ్నిస్తాడు. ఓ ప్రియతమ పాఠక మహాశయా... " వసంతం అనేది ప్రకృతికి కాదు మనిషికి కూడా రావాలి. ప్రతీ మనిషికి రావాలి, పండగలాగా ప్రతీ ఏడు రావటం కాదు, ప్రతీ రోజూ రావాలి" అని కోరుకోటం వల్ల కవి హృదయంలోని అభ్యుదయాన్ని పసిగట్టవచ్చు.



నిన్నటి తనయులే ఇవ్వాల్టి తల్లిదండ్రులు, ఇవ్వాల్టి తల్లిదండ్రులు రేపటి తనయుల భవిష్య మార్గాన్ని చూపే ధాతలు. వారు పల్లెకేగితే అనుభవించే ఆనందం అంతా ఇంతా కాదు. నరేశ్ రావు కవిత్వమే ఒక పులకింతగా "ఇపుడు పల్లె గడిచిపోయిన స్వర్గం/ పిల్లలకు పల్లెను చూపించడమంటే / నా బాల్యానికి ఫ్రేము కట్టి చూపించడమే / నా అడుగుల చప్పుడును రికార్డ్ చేసి వినిపించడమే/ మా పెరట్లోని వేపచెట్టు పుల్ల చేదును /పొద్దున్నే తీయగా అనుభవించాలని ఎంత తపన" ప్రతీ పాఠకున్ని తమ గ్రామానికి తీసుకెళ్తుతుంది. అక్కడ నెమరువేసుకొనే పాత జ్ఞాపకాలు అనేక తీపి గురుతుల పండ్లను తినిపిస్తాయి. వేప పుల్లను తిన్నా, చేదు అనుభవాలు గుర్తుకు వచ్చినా తాజాతాజా పండ్లను తిన్నట్లే ఉంటుంది, ఆనందం రెట్టింపు అవుతుంది. పాత జ్ఞాపకాలు ఇచ్చే ఆ అద్భుతమైన ఆనందం వల్ల ఆయుష్షు కూడా రెట్టింపు అవటం ఖాయం. వెనుకటికి 'ఈ కథ విన్నవారికి కన్నవారికి సుఖసంతోషాలు కలుగుతాయని' విన్నట్లు గుర్తు. ఇపుడు ఈ కావ్యం చదవటంవల్ల అనుభవించ వచ్చునని అనిపిస్తుంది. మనిషి జీవితంలో పొందే అనుభూతి ఆనందం కంటే ఈ కావ్యం చదవటం వల్ల ఇచ్చే అనుభూతి ఆనందం ఎక్కువ కలుగుతుంది.

తల్లిదండ్రుల పాత్రలు ఎలా ఉండేవో గుర్తు చేసే సన్నివేశాలు ఇంకా కొన్నింటిని పరిశీలిస్తే 'నాన్నగారి/ అసందర్భ మాటలకు సమయస్ఫూర్తిగా స్పందిస్తూ/ అప్రస్తుత ప్రసంగాన్ని / ఇంటి ఖర్చుల పద్దుల్ని / ఒక్కటి కూడా విడువకుండా గుర్తు చేస్తూ/ గంటా గణనను, / అమ్మ నిర్వహిస్తుంది" అని అమ్మను అవధానితో పోల్చడం బాగుంది. అమ్మ నాన్నకంటే ఎందుకు ఇష్టమవుతుందో, అమ్మకు ఎందుకు గౌరవం ఇవ్వాలో వివరించే కవిత "ఆర్థిక స్వాతంత్ర్యం – ఆకాశంలో సగం / నాన్న ప్రభుత్వ ఉద్యోగానికి తోడుగా / ఇంటి, ఆఫీసు బాధ్యతలు / సక్రమంగా నిర్వహిస్తూ / ఉద్యోగం చేసే అమ్మ అంటే మాకు గౌరవం" అని అంటాడు. పట్టణాల్లో నివసిస్తున్న తనయులకు తల్లిదండ్రులు ఎందుకు వచ్చి పోయే చుట్టాలవుతున్నారో కూడా వివరించటం నేడు కనపడే ఒక వాస్తవ చిత్రీకరణ పాన్‌దాన్ కవిత "ఊరును విడవలేని అమ్మా, నాన్నలు / అపుడపుడు వచ్చి వెళ్లే చుట్టాలైనారు, చిన్నాన్నలు వేరైనారు" అని వివరిస్తుంది.

2

మానవతాదృష్టిని సినారె. జీవిఎస్. కొలకలూరి ఇనాక్‌లాంటి వాళ్ల సాహిత్యంలో చూసాను. పాఠకులకు చూపించ గలిగాను. పదేండ్ల తర్వాత ఇప్పుడు

నరేశన్న కావ్యంలో కూడా చూసాను. ఒక గొప్ప జాతీయవాదిగా, ఒక గొప్ప మానవతావాదిగా బలపరిచే కవితాసౌందర్యం, సాహిత్య చరిత్రలో నిలిచిపోయే సత్తా ఈ కావ్యంలో ఉంది. దీనిలాగే కవి కూడా నిండుగా మానవతా వాదం ఉన్న వ్యక్తి. ప్రతీ కవిత ఒక ఆణిముత్యం. ప్రతీ పాఠకున్ని కదిలించే కవితామాధుర్యం ఈ కావ్యంలో ఉంది. ఈమధ్యలో నన్ను రెండే రెండు కావ్యాలు కదిలించాయి. మొదటిది కాసర్ల నరేశ్ రావు కావ్యం 'కాలస్పర్శ', రెండవది అనుమాండ్ల భూమయ్య 'శాంతిగర్భ' కావ్యం. ఇవి రెండూ చదివినప్పుడు జ్ఞానపీఠ అవార్డు పొందిన కావ్యం విశ్వంభరను దర్శించినట్లు అనిపించింది. శాంతిగర్భ కావ్యం మొత్తం తనయుల కోసం తపించే నేపథ్యంలోనే కొనసాగి అంతే ఆవేదనతో ముగిస్తుంది. అదొక తాత్విక సందేశ కావ్యం. నిజంగా నరేశన్న యూనివర్శిటీ స్థాయిలో ఉండాల్సిన వ్యక్తి.

**స్వాప్నిక వసంతం** అంటే ఏదో వెన్నెల్లో ఆడపిల్లలు అనుకున్నాను. చదివిన తర్వాత విస్మయం చెందాను. శీర్షిక ఒకవైపు ఆలోచింప చేసింది. చిత్రీకరణ ఇంకొకవైపు ఆలోచింప చేసింది. 'బాలకార్మిక వ్యవస్థను' నిర్మూలించి పిల్లలను పూలపాన్పులో పండబెట్టి సుఖాలను అందించే వసంతాన్ని కోరుకోటం వల్ల కవిలో ఉన్న అభ్యుదయ వాదం బయటపడింది. **బాల కార్మికుల వ్యవస్థ** దేశానికి మంచిది కాదనే భావం ఈ కవితలో ఉంది. రేపటి తరాలకు నవశక్తులు నిండిన సైనికులుగా ఉండాల్సిన బాలకార్మికులు బాధలతో, ఒక్కొక్కరి జీవితం ఒక పెద్ద అగాధంగా ఉండకూడదని వారిలో నిత్యవసంతం నిండి ఉండాలని కోరుకుంటున్నాడు కవి. *'మనిషి మనిషి బతుకుల్లో పచ్చదనం పల్లవించి,/ ఆశలు ఆనందంగా విరిసి /పసిడి రంగుల్లో కలలను పండించే,/ వసంతాన్ని కోరుకున్న'* కవి హృదయానికి సలాం చెప్పాల్సిందే. సమాజ సంక్షేమం కోసం ఇంకా ముందుకెళ్లి *"ఆర్జన బాధలు,/ గాధలు పల్లవిగా /స్వార్థ రహిత మానవ ప్రగతి గీతాన్ని/ గొంతెత్తి పాడే కోకిల గొంతుకు / ప్రేరణ యిచ్చే వసంతం కావాలి/ నా ప్రజలు నవశక్తులు నిండిన సైనికులు/ నా సమాజం చైతన్య సాగరం/ నా దేశం సగర్వంగా తలెత్తిన జాతీయజెండా/ మనిషి రూపాంతరం చెందిన మనీషి"* అని మరో మనిషిని చూపించగలిగాడు.

నిశ్శబ్ద విప్లవకారున్ని కవిలో చూడవచ్చు. విప్లవకారుడు కావాలంటే కారల్‌మార్క్స్‌నే చదువనక్కర్లేదు. అంతే మొత్తంలో ఆయుధం చేపట్టనక్కర్లేదు. కారల్‌మార్క్స్ కంటే గట్టి పిండం కవిలో ఉన్నాడు. చలికైనా, వానకైనా, ఎండకైనా



పట్టణవాసులు భయపడినట్లు పల్లెవాసులు భయపడరు. ఎందుకంటే వారే ఉత్పాదకులు. ఉత్పత్తి చేసే క్రమంలో శ్రమజీవుల ముందు ఏ కాలమైనా కుదేలై పోవలసిందేనని చిత్రించాడు *'కదిలే శ్రమ జీవిలో/ అసలైన వెచ్చదనాన్ని చూసి/ చలి పిల్లి పరుగెత్తుతుంది/ ఈ* ***చలి*** *పులి పల్లె సింహం ముందు మాత్రం కుదేలై పోతుంది/ వేగు చుక్కతోనే పనుల మంత్రాన్ని జపిస్తూ/ ఎద్దుల గంటలు/ పలుగు-పారల చప్పుళ్ల సంగీతంతో/ పల్లె ఆవులింత అంటేనే చలికి ఉలికిపాటు"* పల్లె చలినే భయ పెట్టిస్తుందని వివరించటం బాగుంది.

మనిషి మనిషి ఎప్పుడవుతాడో చిత్రించిన చిన్న కవితలో మనిషి నిజరూపాన్ని చూపెడుతాడు. నిజంగా ఈ కావ్య కాలస్పర్శ ప్రతీ కవితలో ఉన్నప్పటికీ కావ్య ప్రాణం మాత్రం ఈ కవితలో ఉంది. అన్ని కవితలను చదివిన సంతృప్తి కంటే కూడా **'నేను చూసాను'** కవిత ఎక్కువ సంతృప్తిని ఇస్తుంది. ఎందుకంటే మానవున్ని మనుగడ వైపు నడిపించే మనసును, సక్రమమైన మార్గం వైపు నడిపించే శక్తి ఈ కవితకుంది. *"తనదేశం కోసం/తాను నిలువెత్తు నీరై కరిగినపుడు / తాను వెలుగెత్తు దీపమై తరిగినపుడు/ తాను ఎలుగెత్తి గొంతుకై మోగినపుడు / నేను మనిషి - మనిషి కావటం చూసాను!"* అంటాడు. ఇందులో జాతీయవాదిగా, మానవతా వాదిగా కవిని చూడవచ్చు.

అమృత వాహినిలా సాగే పదాల పరంపరలను హైజాక్ చేసి, పొడిపొడి మాటలుగా జేసిన దౌష్ట్యం నీది అని **సెల్‌ఫోన్‌ను** నిందించటం కనపడుతుంది. టెక్నాలజీ అభివృద్ధి వల్ల కమ్యూనికేషన్ పెరిగి పోతుందనే భ్రమలో మనిషి పడిపోతున్నాడని, ఒకవిధంగా మానవ సంబంధాలు పెరగడానికి బదులు తరిగి పోతున్నాయని చెప్పే కవిత సెల్‌ఫోన్. సెల్‌ఫోన్లు వచ్చిన తర్వాత తీరిగ్గా కూర్చొని, హృదయాన్ని విప్పుకొని , తనివితీరా రాసి, పోస్టుచేసే ఉత్తరాల సంప్రదాయం అడుగంటి పోయిన మాట వాస్తవం. ఈ వాస్తవాన్ని అత్యంత రమణీయంగా చిత్రించాడు *"అల్లంత దూరంలో ఉండే నా హితులకో /సన్నిహితులకో ఆలోచనా పరీమళాలను/ అక్షరాల మాలలుగా కట్టి / విస్తృత ఉత్తరం లాగా పంపించే నామనసు మీద/ మత్తుమందు చల్లి/ బిల్లుల వార్నింగ్‌లతో కొంచెం మాటలుగా / కుంచించుకు పోయేటట్లు చేసిన నామీది నీ అధికారాన్ని/ నేను ఆలోచించలేకపోయాను"* అని బాధ పడుతుండటం కనపడుతుంది.

ఆయన జీవన స్థలికి **బువ్వకుండ**లో జాతీయతను కనపరిచాడు. *"వానొస్తే భూమి బువ్వకుండ అవుతుంది/చెట్లు ఊపిరి కొండలవుతాయి/ మనిషి*

నిలువెల్లా నీరవుతాడు." మనసు పడవయై బాల్య నదిలో కాసేపు తిరిగిరావాలని, వర్షం వర్తమానంలో ప్రాణదాత కావాలని, గతంలోని చల్లని జ్ఞాపకం కావాలని, భవిష్యత్‌లో ఆశల పందిరీ కావాలనీ కోరుకున్నాడు. వర్షం భూమిలోతుల్నే కాదు, మనిషి లోతుల్నీ తడపాలనీ, ఆ తడిమనసు నుండి ప్రేమ మొలకలెత్తాలనీ, దయ చిగుచించాలనీ, అది మానవతా మహావృక్షంగా ఎదగాలనీ, ఆ వృక్షం నీడలో నా దేశం సురక్షితం కావాలనీ, సుభిక్షితం కావాలనీ' అని కోరుకున్న కవి గొప్ప దేశభక్తుడు. ఈ కవితలో కూడా కవిలోని జాతీయవాది, ఒక మంచి మానవతావాది బయటకు వస్తాడు.

**ఆడపిల్లను** నిన్నటి చంద్రవంకగా నేటి చందమామగా, రేపటి సూర్యుడిగా వర్ణించడం బాగుంది. ఈ కవితలో ఆడపిల్ల తన స్వగతాన్ని చెప్పుకోటం ఉంది. అలాగే కవిదూరిన కాంక్లూజన్ ఉంది. అయితే ఈ కాంక్లూజన్ కూడా ఆడపిల్లచేత మాట్లాడిస్తే బాగుండేది. "మగవారితో సమంగా ఉద్యోగాలు చేస్తున్నామంటే /బరితెగించడం కాదు/ సాహసంతో సమానత్వాన్ని సాధించడం / ఆకాశంలో సగం కావాలనుకుంటున్నామంటే / అత్యాశతో కాదు/ అవకాశాల సర్వస్వాన్ని పొందడం కోసం" అని చెప్పటం స్త్రీపరంగా తన వాదనను వినిపించడం, స్త్రీ రాణించడం సమాజానికి అవసరమని చెప్పటాన్ని చూస్తే ఆయనలో సమానత్వాన్ని కోరుకునే మానవతావాది కనపడతాడు.

3

**రోడ్డు ఆత్మగీతి** కవితలో త్యాగం కనపడుతుంది. మనుషులను వారి గమ్యానికి చేర్చడానికి రోడ్డు తన వెన్నునిచ్చింది. ప్రయాణీకులు సుఖంగా ఇంటికి చేరడానికి రోడ్డు పడే తపనను చిత్రించాడు. అలికి ముగ్గు వేసే నా పల్లె జనం కూడా ఈరోజు కంకర్లు, తార్లు, సిమెంట్లు పోసి సిసిరోడ్లు వేస్తున్నారు. మానవాభివృద్ధిని ఆకాంక్షించే రోడ్డు, తనగుండె బరువును పెంచకండి అని ప్రాధేయపడుతూ, నిదానంగా వెళ్లండి ప్రయాణం విజయవంతం కావాలి గానీ ప్రాణాంతకం కావద్దు. అజాగ్రత్త నుండి జాగ్రతవైపు మనుసు పెట్టండి అని రోడ్డు ప్రయాణీకులకు హితబోధ చేసే మంచి సందేశం రోడ్డు ఆత్మగీతిలో కనపడుతుంది. ఒక వేళ కర్మకాలి ఏదైనా ప్రమాదం ఒనగూరితే 108 ఉంది అనే మనో నిబ్బరాన్ని మనకు కవి అందిస్తున్నాడు. యమధర్మరాజును కూడా వెనక్కి పంపించే మంత్రం గల యంత్రం 108. చిరునవ్వుల వెన్నెలలు కురిపిస్తుంది.



హనుమంతుడు తెచ్చి ప్రాణం పోసిన సంజీవని పర్వతం, గరత్మంతుడు మోసుకొచ్చిన అమృతభాండం, కచుడు నేర్చుకున్న మృత సంజీవనీ విద్య 108. దీనిని మానవుని ఆత్మబంధువుగా వర్ణించి, దానికి దైవత్వాన్ని ఆపాదించి, దేని చుట్టో కాదు దీనిచుట్టూ 108 సార్లు ప్రదక్షిణ చేసుకోవాలనే చూయించడం గొప్ప సందేశంగానే భావించాలి.

కాసర్ల నరేశ్ రావు కావ్యంలో వస్తువును చూసినట్లయితే మానవ నాగరికత కొనసాగింపు ఉంది. పుట్టిన సందర్భంలో రాసిన కవిత్వం మొదలుకొని మరణించే వరకు రాసిన ఇతివృత్త పరిధి అత్యంత సహజ సుందరంగా కనపడుతుంది. కవి ఔటర్‌గా ఉన్నాడు, ఇన్నర్‌గా ఉండి చెప్పటం కూడా ఉంది. అయితే ఏకోణం నించి తీసుకున్నా మానవ విలువలకు, స్నేహానికి, ఆర్ద్రత, ఆవేదన, మార్గదర్శకత్వం, అన్నింటికీ మించి కావ్య సందేశానికి సంబంధించిన కవిత్వం సాహిత్య చరిత్రను పరిపుష్టం చేస్తుంది. ఏ కవితను చూసినా శిల్పాన్ని చెక్కినట్లే శిల్పనిర్వాహణ కనపడుతుంది. ప్రకృతితోపాటు వర్షం, చలి, పాట, స్త్రీజీవితం, వృద్ధాప్యం, కుటుంబం, పలక, పిల్లలు, పెద్దలు, పెళ్లి పేరంటాలు, పాత్రచిత్రణ, కథాకథనం, ఉత్తమ మధ్యమ పురుష, ఫ్లాష్‌బ్యాక్ కథనాలు, సంఘటన, సంఘర్షణ, సన్నివేశ చిత్రణలు, ఎత్తుగడలు, ముగింపులు విజయవంతంగా చిత్రించాడు. ప్రధానంగా శీర్షికలను గమనిస్తే బువ్వకుండ, క్యాలెండర్, గాయపడిన తెలుగు పాట, సెల్‌ఫోన్, 108, కోకిల వాలని చెట్టు, రోడ్డు ఆత్మగీతి, రంగుల కోకిలలు, బంగోయి, ఆకాశంలో చెట్లు, మేం నరకంలో హాయిగా వున్నాం!, మొదలగు వాటిలో ఆశ్చర్యకరమైన రసం, సౌందర్యవంతమైన అద్భుతాంశాలు అనేక మంది పాఠకులను ఆకట్టుకొని, కదిలించి, ఆలోచనలకు గురి చేసి, ఆనందింప చేస్తాయి. ఈ కావ్యంలో ఏ అంశమైనా వైవిధ్యభరితంగానే కనపడతాయని చెప్పటంలో ఆశ్చర్య పడనక్కర్లేదు. నిజామాబాద్‌లో ఒక అద్భుతమైన కవికి, సహృదయమైన కవికి నేను స్నేహశీలిగా ఉండటం నిజంగా అందరికి కలగని ఒక మంచి అదృష్టంగా భావిస్తున్నాను. ఈ కావ్యం సాహిత్య చరిత్రలో రాణించాలని, నిలవాలని మంచి గుర్తింపు పొందాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ నాదృష్టిలో 'అత్యుత్తమ కవి'గా ముద్ర వేసుకున్న నరేశన్నకు శుభాకాంక్షలు తెలుపుతూ అభినందిస్తున్నాను...

నిజామాబాద్,
తేది: 08-09-2009.

నేర్పిన కాలజ్ఞాని కూడా". బాల్యంలోని ఉత్తి అనుభూతులనే కవిత్వం చేయాలనే కాంక్ష కవికి లేదు. బాల్య స్మృతుల ప్రయోజనం నేటిపిల్లలకు అవసరం అని చెప్పడం కోసం ఈ కవితరాశాడు. భూతద్దాలు కోల్పోయిన నేటి బాల్యాన్ని చూస్తే వేదన కలుగుతుంది.

కాసర్లలో పల్లె జ్ఞాపకాలు యెన్నో విధాల ఉన్నాయి. చదువురీత్యా వృత్తిరీత్యా పల్లెకు దూరమైనా పల్లెకు దండం పెట్టే కవితలు చాలారాశాడు. అందులో నాకు నచ్చిన కవిత 'బంగోయి'. అప్పుడే పుట్టిన పసిపాపలకు 'తొట్లె' యెలాంటిదో పెద్దలకు 'బంగోయి' అలాంటిది. దానితో కవికున్న అనుబంధం మరువలేనిది. ఇది కవి అనుబంధమే కాదు గ్రామీణుల అనుబంధం కూడ. ఈ బంగోయి కవిత చదువుతున్నపుడు నేననుభవించిన బంగోయి అనుబంధం కూడ జ్ఞాపకానికి వచ్చింది. "మాతాత బంగోయి మీద పడుకుంటే సింహంలాగా ఉండేవారు. నిశ్శబ్దపు నిశిలో బంగోయి చేసే కిర్రుకర్రుశబ్దం మానిద్రకు భరోసానిచ్చేది". నగరజీవనంలో బంగోయి శబ్దం వినబడదు. ఇంకొన్నేళ్ళుపోతే బంగోయి పురావస్తు ప్రదర్శనశాలకు వెళుతుంది. ఒకప్పటి గ్రామీణ సమాజం వాడిన బంగోయిగా మిగులుతుంది. బంగోయి కళ్ళముందే అదృశ్యమైపోతుంటే దానితో అనుబంధం వున్నవాళ్ళు బాధపడకుండా యెలా ఉండగలరు.

కాసర్లకు బాధకలిగించిన ప్రతి అంశంమీద కవిత్వం రాశాడు. చివరకు సెల్‌ఫోన్ మీద రాసింది కూడా. సెల్‌వల్ల శబ్దస్పర్శతప్ప మనుషులస్పర్శలు కరువవుతున్నాయి. "మిత్రులారా! దయచేసి నాకు ఫోన్ చేయవద్దు. నేనూ మీకు చేయను" అంటూ యాంత్రిక విసుగును వ్యక్తీకరిస్తారు. అలాగే గాయపడిన తెలుగు పాటలమీద, స్వాప్నిక వసంతాలమీద, చలిపులిమీద, డైరీమీద, పండగలమీద, పాన్‌దాన్‌మీద ఇలా తనను ప్రభావితం చేసిన ఎన్నో వస్తువులను కవిత్వీకరించాడు.

ఈనాడు మంచి కవిత్వం వస్తున్నది. ఆ కవిత్వంతో సరితూగగల లేదా మిగతావాళ్ళ కవిత్వాన్ని నడిపించగల కవిత్వాన్ని రాయగల శక్తి కాసర్లకున్నది. మా నిజామాబాదు నుండి బలంగా విన్పిస్తున్న కవితాగొంతు కాసర్లది. భవిష్యత్తులో వస్తువులో, అనుభూతిలో, వ్యక్తీకరణలో మరింతగా కాసర్ల రాటుదేలాలని నా ఆకాంక్ష. కాలస్పర్శ సాహిత్యచరిత్రలో నిలబడాలని నా కోరిక...







## రెండు గుండెల నిండు స్పందన

కవితాసౌధ నిర్మాణ శిల్ప రహస్యం...... క్షుణ్ణంగా మర్మమెరిగిన మాననీయ, దినదిన ప్రవర్ధమాన వర్తమాన కవి,....... ఉన్న కవి శ్రీ కాసర్ల నరేశ్‌రావు

" తడిమనసు నుండి ప్రేమ మొలకతెత్తాలి
దయ చిగురులై తలెత్తాలి
మానవత మహావృక్షంగా ఎదగాలి" అని ఉన్నతంగా

ఉదాత్తంగా ఆశించిన కవి, గొంతెత్తి సంభాషించిన కవి కాసర్ల.

" పన్నెండు పత్రాల పచ్చపచ్చని అనుభూతులతో
అరవిరిసిన అంకెల పుష్పం
ఏడు వారాల 'నగలతో' అలంకరింపబడి

ఏడాది పొడుగునా తోడై, కాలమార్గ సూచిక క్యాలెండర్‌ని కవిత చేసిన ఘనత కాసర్లది.

అలనాటి పదబంధమైన, మన గడచిన బాల్యానికి తీయని అనుబంధమైన 'బంగోయి'ని మధుర మలయ మారుతంగా మనలో స్మృతుల ఉయ్యాల లూపిన ఈ కవి కాసర్లను బంగోయి వేదికగా సత్కరించ వచ్చు.

'స' అంటే సహనం
'త' అంటే త్యాగం
'ర' అంటే రమణీయత... అని 'స్త్రీ'ని విశేషంగా విశ్లేషించిన

కవి, అమ్మను 'అవధాని'యని పూజించిన పృచ్ఛకుడు కాసర్ల అమ్మలందరి ఋణాన్ని తీర్చుకున్నాడనే మా భావన. చి॥ కాసర్లకు మా ఉభయుల హృదయ దీవెన.

బువ్వకుండతో మొదలై కళ్ళతో చదివిన వెంటనే మనసు ఎర్రగా పండేలా చేసిన 'పాన్‌దాన్' వరకు కవి కాసర్ల నిత్య సాహిత్య సత్య సామాజిక ప్రస్థానమే ఈ 'కాలస్పర్శ'.

కాలాన్ని అనుసరించి కవిత్వంగా స్వరించే కాసర్ల మీద కాస్తంత కాదు, ఆకాశమంత ఆశ మాది...

**కందాళై రాఘవాచార్య**
నిజామాబాద్,
9908612007

**వి.పి. చందన్‌రావు**
నిజామాబాద్,
9440038565

# కృతజ్ఞతాస్పర్శ...

నా 'గుండెగాయాలు', 'లలితతరంగాలు' రెండు పుస్తకాలను నిండుమనసుతో హత్తుకొని నన్ను ఆశీర్వదించి... అభినందనలనందించిన సమస్త సాహితీబంధువర్గానికి...

సమీక్షలను ప్రచురించి ప్రోత్సహించిన ఆంధ్రజ్యోతి, 'పత్రిక', ప్రసారిక, నేటినిజం, ఇందూరువైతాళిక, మూసీ మొదలైన సాహితీపత్రికలకు...

ఈ 'కాలస్పర్శ' పుస్తకంలోని కవితలను ప్రచురించిన, వివిధ సాహితీపత్రికలకు... ఆకాశవాణి... సి-ఛానల్‌లకు...

మా విశ్వవిద్యాలయ 'చెలిమి'ని చెదరనిజ్ఞాపకం అనే సిరాగామార్చి ఆత్మీయంగా తన గుండెచెలిమెను ఆవిష్కరించిన తెలంగాణ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్యక్షులు డా॥కనకయ్యగారికి...

నన్ను సామాజికకవిగా స్పర్శించి... అభినందనలను అక్షరాలుగా వర్షించిన జగమెరిగిన కవి శ్రీ నాళేశ్వరం శంకరం గారికి...

నిండుమనసుతో నన్ను ఆశీర్వదించిన ఇందూరు జంటకవులు వి. పి. చందనరావు, కందాళై రాఘవాచార్యులగారలకు...

ముఖచిత్ర రచన రమణీయంగా చేసిన సుప్రసిద్ధ కవి, చిత్రకారులు శ్రీ సూరారం శంకర్‌గారికి...

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన తెలుగు విశ్వవిద్యాలయానికి... మరియు...

నా చిన్ననాటి స్నేహితులు పి.శ్రీనివాస్ - భాస్కర్‌రాజ్, కె.కాంతారావు, దయానంద్-సంతోష్, కుంట పెద్ద గంగారెడ్డి, తూంపల్లి శ్రీనివాస్, యన్.బాలకిషన్ - జి.సుదర్శన్‌లకు, కేర్ డిగ్రీ కాలేజ్ నరాల సుధాకర్, కొంద్ర ధన్‌పాల్ గారలకు...

డి.టి.పి సహకారం, సలహాలు అందించిన కవిమిత్రుడు ఘనపురం దేవేందర్‌కు...

అక్షరాల కూర్పును అందంగా చేసి పుస్తక రూపాన్ని సాకారం చేసిన ఆత్మీయమిత్రుడు చింతల శ్రీనివాసు గుప్తకు...

పుస్తకాన్ని అందంగా మలిచిన శ్రీ కల్కి గ్రాఫిక్స్ ప్రింటర్స్, కామారెడ్డి వారికి...

నిజామాబాద్, కామారెడ్డి సాహితీ మిత్రులకు, ప్రోత్సహిస్తున్న మా 'సుద్దులం' పాఠశాల ఉపాధ్యాయ మిత్రులకు, నా సాహితీ ప్రస్థానంలో సంపూర్ణ సహకారం అందిస్తున్న నా కుటుంబ సభ్యులకు... పేరుపేరునా ధన్యవాదాలు...!



# ఇందులో...

# బువ్వకుండ

ఇవాళ గగనతల కాగితంపై
నల్లమబ్బు సంతకాన్ని చూసాను
వానచుక్క ప్రాణం పోసుకుంటున్నది
ఇక్కడ భూమిపై పోతున్న ప్రాణాలకు
ఊతమిచ్చినట్లైంది
వాన అంటే కేవలం నీటిసమూహమే కాదు
భూమి గుండెల్ని గుండెలోతుల్ని
పరవశింపజేసే ప్రకృతిమాత తడిముద్దు
చేతులు చాపిన నేలబాలున్ని
అమాంతంగా అక్కున చేర్చుకున్న
ఆకాశతండ్రి వాత్సల్యముద్ర
అమృతం - దేవతల వద్దే ఉందనడం
నిజం కాదేమో ?
విత్తనం గొంతులో ఊపిరినింపి
మట్టికి మల్లెదనం అద్దిన వాన
అమృతం కాదా?
కరవు కోరలకు చిక్కి జీవచ్ఛవాలుగా బ్రతుకుతున్న
రైతన్న కళ్ళల్లో జీవనవెలుగుల్ని నింపిన
వాన అమృతం కాదా?
వానొస్తే, భూమి - బువ్వకుండ అవుతుంది
చెట్లు ఊపిరి కొండలవుతాయి
మనిషి నిలువెల్లా నీరవుతాడు
వర్షంలో తొలిసారి తడిస్తే ఎంత పెద్దమనిషికైనా
అమ్మస్పర్శ గుర్తుకురాదూ ?
నాన్న 'పలకరింపు' అనిపించదూ ?

కన్నఊరు కళ్ళముందు కదలాడదూ?
మనసు పడవయై
బాల్యనదిలో కాసేపు తిరిగిరాదూ?
వర్షం వర్తమానంలోని ప్రాణదాతయే కాదు,
గతకాలంలోని చల్లనిజ్ఞాపకం కూడా
భవిష్యత్తులోని ఆశలపందిరీ అదే
వర్షం భూమిలోతుల్నే కాదు,
మనిషిలోతుల్నీ తడపాలి
తడిమనసునుండి ప్రేమ మొలకలెత్తాలి
దయ చిగురులై తలెత్తాలి
మానవతామహావృక్షంగా అది ఎదగాలి
ఆ వృక్షం నీడలో...
నా దేశం సురక్షితం కావాలి
సుభిక్షితం కావాలి

(నేటినిజం తెలుగు దినపత్రిక స్వాతంత్ర్యదినోత్సవ ప్రత్యేక సంచిక 2008)



# క్యాలెండరు

పన్నెండు పత్రాల పచ్చపచ్చని అనుభూతులతో
అరవిరిసిన అంకెలపుష్పం క్యాలెండరు
ఏడు 'వారాల' నగలతో అలంకరింపబడి
తోడూ-నీడై మనతో మనుగడ సాగిస్తున్న
మనయింటి మహాలక్ష్మి క్యాలెండరు
మున్నూట అరవయైదు రోజుల్లో
కన్నీటి దొంతరలను కమనీయ సంతోషాలను
కలిపి మోస్తూ
గుండెగోడపై అనుభవాలమేకు ఆధారంగా
వేలాడే ఆత్మీయబంధువు క్యాలెండరు
వంగిన నడుమును మరీ వంచి
నానమ్మ తిథులు నక్షత్రాలంటు చుట్టూ
ప్రదక్షిణం చేస్తుంటే
క్యాలెండరు ఒక గుడి అవుతుంది
మంచి చెడులను తెల్పే పురోహితుడు అవుతుంది
ఒకటవ తేదీ వెళ్ళిన ఒక వారం లోపే
నాన్న తన జేబులన్నీ ఖాళీచేసుకొని
మళ్ళీ ఫస్టుతారీఖు కై ఎదురు చూసేవేళ
క్యాలెండరు ఆశల స్వర్గమవుతుంది
వచ్చే నెల కొరకు అప్పుపత్రము అవుతుంది
పాలవాడి పద్దులు పని మనిషి కాడలు
అమ్మ గణించి గుణించి డబ్బులు పంచేప్పుడు
క్యాలెండర్ రెపరెపలాడే కాలిక్యులేటర్ అవుతుంది
సమగ్ర సమాచారంతో గోడకంప్యూటర్ అవుతుంది
ప్రతిరోజూ ఆదివారమే కావాలని ప్రార్థన చేసే

చిన్న తమ్ముణ్ణి
లెక్కప్రకారం బడికి పంపించే ప్రయత్నంలో
క్యాలెండరు నాన్న చేతిలో కర్ర అవుతుంది
పాఠాలు చెప్పని బడిపంతులు అవుతుంది
సంవత్సరం గడిచి
క్యాలెండరుకు వీడ్కోలు పలికేవేళ
ఎన్ని జ్ఞాపకాలు ఒలికి పోతాయో
ఎన్ని అంకెలు అలాయ్‌బలాయ్ చేస్కుంటూ
ఆప్యాయంగా గుండెలో ఒదిగి పోతాయో
కొత్తక్యాలెండరు వాసన చూస్తేనే
కొత్తసంవత్సరం వచ్చినట్టు లెక్క
ఇక కొత్తనేస్తంతో దోస్తీషురూ...

(ఆదివారం ఆంధ్రజ్యోతి 28-12-2008)



# ధరాఘాతం

ఈరోజు ఆదివారం... అయినా
ఉదయం కాక ముందే ఉలిక్కిపడి నిద్రలేచాను
కాసేపాగితే... మార్కెట్ పద్మవ్యూహంలోకి వెళ్ళాలి
అర్జునున్ని యెప్పటికీ కాలేని నేను...
ఎప్పుడూ అభిమన్యున్నిమాత్రం అవుతాను
చచ్చిపోలేను కానీ చచ్చినంత పనవుతుంది
"టమాటకన్య"తో మాటలు లేక చాలా రోజులయ్యింది
'మూటలు' తెమ్మంటుంది... మాటలా...?
'బెండకాయ' బెదిరింపులతో యెప్పుడో బేజారైనాను
'బీరకాయ' ధరలో యిప్పుడు బీరు వస్తున్నది
'కాకరకాయ' తినకన్నాముందే చేదును పంచుతున్నది
'వంకాయ' కూడా నన్నేంకొటావులే అన్నట్లు
వంకర నవ్వు నవ్వుతున్నది
'ఆకుకూరలు' షోకేసుల్లోని అమ్మాయిల బొమ్మల్లా
ముచ్చటగా ముస్తాబై నిలబడతాయి
చూసి సంతోషించాలే గానీ... కొని కాదు...
బియ్యంధర దయ్యమై తరుముతున్నది
దాని ముందు దోషిలా తలొంచుకొని... నేను...
నూనెతో ఎప్పుడూ జారిపడలేదు... కానీ...
దాని ధరను చూసి మాత్రం బొక్కబోర్లా పడ్డాను
నింగికి చేరిన నిత్యావసర వస్తువుల ధరలు
దిగిరావు... గాక... దిగిరావు! నేనే పైకి పోవాలి!
అధిక ధరాఘాత జీవితగరళాన్ని
ఆనందంగా భరించాలంటే
హాస్యరసామృతపానం తప్పదు... కదా!
మరిమీకో.....?

(నేటినిజం "సాహితీ కెరటాలు" తేది 01-10-2009)

# సంక్రాంతి స్వర్గం

ఈరోజు సంక్రాంతి
భూమాత బుగ్గలమీద చుక్కల ముగ్గులల్లుతూ
తెలుగింటి అమ్మాయిలు
యాసిడుచుక్కల వానలో తడిసి
నింగిచుక్కల్లో కలిసి పోయిన
అందమయిన చందమామ 'స్వప్నిక'ను
రంగురంగుల ముగ్గుల్లో వెతుక్కుంటూ
వెక్కివెక్కి ఏడుస్తున్నారు
గోవిందనామ స్మరణ చేయకుండానే
వేలకోట్ల ప్రజాధనాన్ని గోవిందచేస్తూ
పంగనామాలను ప్రజలకు పెడ్తున్న
నాయకహరిదాసులనుచూసి
ప్రజాస్వామ్యం పరేషానవుతున్నది
నగర వాకిట్లో అందమైన 'హైటెక్ గొబ్బెమ్మలుగా నిల్చి
ప్రపంచాన్ని కంప్యూటరు చేసి, దానిపై
యువతరానికి ఆశాగీతికలు విన్పించిన 'సత్యం'
అసత్యమై నేడు కుప్పకూలగా
యువహృదయ కలలు భగ్గున భగ్నమవుతున్నాయి
మధ్యతరగతి ఆకాంక్షలను షేరు బజార్లో ఎగరేసిన 'సత్యం'
అసత్యమై నేడు సగటు మనిషిని నడిబజార్లో నిలబెట్టిన దృశ్యం
మనిషి మనిషిని నమ్మలేని తనానికి తెరతీస్తున్నది
దేశంలోని ముచ్చటైన నగరాలను చిన్నపిల్లల్ని చేసి
బాంబులతో 'భోగిపళ్ళు' పోస్తున్న
పక్కదేశపు పరాయితల్లి పాశవిక ఉన్మాదప్రేమలో
నగరజీవనం భయం భయంగా శ్వాసతీస్తున్నది
అధిక ధరల దారం ఆధారంగా ఆకాశంలోకి ఎగిరిన
నిత్యావసర వస్తువుల పతంగులు,



దిగిరమ్మన్నా రాని వైనం
సామాన్యున్ని దిగ్భ్రాంతుణ్ణి చేస్తున్నవి
చదువుల 'అప్పాల మిషన్' లో నలిగి నలిగి
ఆధునిక విద్యార్థి చకితమై 'కాన్వెంటు' మూకుడులో
కరకరావేగి వేదనౌతున్నాడు
'సెజ్‌ల భూభాగోతంలో
చితికిపోయిన రైతుల బ్రతుకుచిత్రం
పంటలకు, భోగిమంటలకు దూరమయ్యింది
నాకు యిప్పుడు,
ఆడపిల్లలు నిర్భయంగా తమ భవిష్యత్తును
ముగ్గుల్లా అల్లుకునే సంక్రాంతి కావాలి
ప్రజల అభిమానాన్ని కిరీటంలా ధరించి
జనహృదయ సామ్రాజ్యమేలే నాయకులుండే సంక్రాంతి కావాలి
యువశక్తి భుజాలపై పల్లకీలో దేశమాత సగర్వంగా
ఊరేగే సంక్రాంతి కావాలి
రైతుల కళ్ళపొలాల్లో
ఆనందపంటలను చూసే సంక్రాంతి కావాలి
నగరహృదయ రహదారుల్లో శాంతికపోతాలు
కవాతు చేసే సంక్రాంతి కావాలి
నెలబడ్జెటు పరమపదసోపానపటంలో
సామాన్యున్ని అధికధరల పెద్దపాము మింగని
సంక్రాంతి కావాలి
చిన్నచిన్న పిల్లలు పాఠశాలఆకాశంలో
స్వేచ్ఛాపతంగాలై ఎగిరే సంక్రాంతి కావాలి... చివరగా...
సంక్రాంతిని ప్రజలందరూ
ఆనందంగా సంక్రాంతిలా గడుపుకునే
సంక్రాంతి కావాలి –

(రాంభట్ల గంగారాం మెమోరియల్ ట్రస్ట్ నిజామాబాద్ వారి రాష్ట్రస్థాయి సంక్రాంతి కవితాపోటీల్లో ప్రథమబహుమతి పొందిన కవిత 2009)

# నేను చూసాను

పచ్చదనాన్ని పదిమందికి పంచుతూ
ఆదరణనీడతో అక్కున చేర్చుకొని
జీవనసఫలత్వాన్ని సాధించేవేళ
మనిషి చెట్టు కావడం – నేను చూసాను!
మంచితనపు సోయగాలను
మానవతా పరీమళాలను
సమాజతోటకి అద్దినపుడు
మనిషి 'పూవు' కావడం – నేను చూసాను
కరుణావర్షాన్ని కఠినహృదయసీమల్లో
కురిపిస్తూ,
హృదయాంతరాంతరాలలో
ఆనందసాగరాలను ప్రవహింపజేసిన వేళ
మనిషి 'మేఘం' కావడం – నేను చూసాను
తనకోసం తనవారి కోసం
తనదేశం కోసం
తాను నిలువెత్తు నీరై కరిగినపుడు
తాను వెలుగెత్తు దీపమై తరిగినపుడు
తాను ఎలుగెత్తు గొంతుకై మోగినపుడు
నేను –
మనిషి – మనిషి కావడం చూసాను!

(నేటినిజం "సాహితీకెరటాలు" తేది 23-03-2009)



# పలక

మొట్టమొదటి చూపులోనే
నన్ను కట్టి పడేసిన అందం నీది,
పట్టీపట్టుకోగానే
ఒదిగిన స్నేహం నీది,
గుండెలకు హత్తుకోగానే
అండనేనంటు అక్కున చేర్చుకున్న
ఆప్యాయత నీది
నీ చెంపకు నా చెంపను ఆనించి
పొందిన ఆ చల్లని స్పర్శను
నేను ఎలా మర్చిపోగలను?
పలకా...!
నా 'ఏక ఛత్రాధిపత్య బాల్య సింహాసనానికి'
పట్టపురాణివి నీవు,
భగవంతుడిచ్చిన నా విద్యాజీవితానికి
దొరికిన తొలి 'పట్టా'వు నీవు –
అక్షరాలపిల్లలు తెల్లగా ఉండాలని
నిన్ను నీవు నల్లబర్చుకున్న 'ఔదార్యం' నీది
నన్ను 'అక్షరం'గా స్థిరీకరించడానికి
ఎన్ని పిచ్చిగీతలను, రాతలను
భరించినావో...?
ఒక్కసారి కుదురుకున్నాక
అక్షరాలు ప్రవాహాలై దొర్లుతుంటే
ఎన్నిసార్లయినా శుభ్రపడడానికి
సిద్ధపడ్డనీవు,
నీళ్ళయినా, ఎంగిళ్ళయినా భరించడం చూస్తే

మా అమ్మకు సరిజోడని పించింది
నేను చిన్నప్పుడు ఏ ఊర్లకు వెళ్ళినా,
మా అమ్మసంచిలో నా బట్టలు ఉన్నా లేకున్నా
నీవు మాత్రం వుండాల్సిందే అన్న నా మారాం
మన సంబంధాన్ని తెల్పుతుంది-
నీ నల్లతెర మీదనే నాకు
అక్షరప్రపంచం పరిచయమయ్యింది.
పదాల 'పట్టు' ను పట్టుకున్నాను
వాక్యాలవరదలను
సృష్టించుకున్నాను-
ఇప్పుడు ఆ అక్షరాలే
నీ పలకఫ్రేమును దాటుకొని
నోటుబుక్కుల మెట్లెక్కి
పత్రికలవాడల్లో, పుస్తకాలమేడల్లో
కవిత్వపల్లకీలుగా ఊరేగుతున్నాయి-
ఇప్పటికీ ఎక్కడన్నా
పలక కన్పిస్తే ఒక్కసారి పట్టుకొని
నా బాల్యాన్ని స్పృశించుకోవాలనిపిస్తుంది
ఎప్పటికైనా, పలక మీద బలపంతో
ఒక కవిత రాసి కృతజ్ఞత చెల్లించుకోవాలన్పిస్తుంది
ఇప్పుడు,
పలకలు లేని 'కాన్వెంటు పిల్లల బ్యాగులు'
చూస్తుంటే,
వీరు 'బాల్యం కోల్పోయిన మరబొమ్మలు'
అన్పిస్తుంది -

("కోటిగొంతుకలు" కవితా సంకలనం, కామారెడ్డి
ప్రచురణ 2009)



# ఆడపిల్ల

తలయెత్తుకు తిరుగుతున్నానంటే
తలబిరుసు కాదు - ఆత్మవిశ్వాసం,
గలగల మాటలగోదారినయ్యానంటే
వాగుడుకాయను కాదు
కలుపుగోలుతనం కొవ్వొత్తితో
మానవసంబంధాలజ్యోతిని వెల్గించడం,
మగవారితో సమంగా
ఉద్యోగాలు చేస్తున్నామంటే
బరితెగించడం కాదు
సాహసంతో సమానత్వాన్ని సాధించడం,
ఆకాశంలో సగం
కావాలనుకుంటున్నామంటే
అత్యాశతో కాదు
అవకాశాలసర్వస్వాన్ని పొందడం కోసం,
ఇప్పుడు, ఆడపిల్ల అంటే
వంటింటికుందేలు కాదు
కాలరెగరేసే మగవాళ్లతో సమానంగా
ఇంటినుండి మింటి దాకా ఎగిసిన తేజస్సు
ధైర్యసాహసాల ఉగ్గుపాలను తాగి
కుటుంబాన్ని వెల్గించే ఉషస్సు...
ఆడపిల్ల, నిన్నటి చంద్రవంక
నేటి చందమామ
రేపటి సూర్యుడు.

(నేటినిజం "సాహితీకెరటాలు" తేది 01-11-2007)

# 108

అది భగవంతున్ని కీర్తించే
నామావళి సంఖ్యగాదు, భక్తిమార్గాన నడిపించడానికి
అది జపమాల లోని
పూసలసంఖ్యాకాదు, పుణ్యం సాధించి పెట్టడానికి
అది పద్యశతకంలోని
పద్యాల సంఖ్యాకాదు, రససిద్ధిని కల్గించడానికి
అది, ఈ భూమి మీద వెలసిన
తిరుపతుల సంఖ్యాకాదు
దర్శనభాగ్యం చేత ధన్యత నొందించడానికి,
కానీ ఆ సంఖ్య -
ఆర్తుల పాలిటి ఆప్తబంధువు
ఆపదలో వున్న వారికి ఆత్మబంధువు
అవసరార్థులకు ఆపద్బంధువు - ఆ సంఖ్య 108,
108 - నూరేళ్ళజీవితాన్ని వెల్గిస్తున్న నూత్నదేవుడు
క్షతగాత్రులను రక్షిస్తున్న శ్రేయోభిలాషి
ఢీ కొన్న వాహనాలచప్పుళ్ళు చల్లారకముందే
108 - ప్రత్యక్షం,
రోడ్డు చిందించిన రక్తం
భూమిలోకి యింకిపోకముందే
108 - ఆగమనం,
108కి ఫోన్ వెళ్ళిందంటే
పోతున్న ప్రాణం కొద్దిసేపు వాయిదా పడాల్సిందే
108 బయల్దేరిందన్న వార్త
గాయాలగుండెలపై లేపనపు చల్లగాలై తగలాల్సిందే
108 శబ్దం చేస్తూ వచ్చిందంటే



యముడైనా సగందారి నుండి
వెనక్కి మళ్ళాల్సిందే!
వందలాది కుటుంబాల్లో
వేయివెల్గుల 'దీపాల'ను పెట్టిన ఘనత 108 ది,
వేల మంది చిన్నారులకు
వాళ్ళ 'నాన్నల్ని' బతికించి బహుమతిగా యిచ్చి
చిరునవ్వుల వెన్నెల్లుకురిపించింది 108,
హనుమంతుడు తెచ్చిన
సంజీవని పర్వతం - 108,
గరుత్మంతుడు మోసుకొచ్చిన
అమృతభాండం - 108,
కచుడు నేర్చుకున్న
మృతసంజీవనీ విద్య - 108,
108 - ఋణం తీరాలంటే దాని చుట్టు
108 సార్లు ప్రదక్షిణ చేయాల్సిందే
1116 సార్లు కృతజ్ఞతలు చెల్లించుకోవాల్సిందే!!

(నేటినిజం "సాహితీకెరటాలు" తేది 07-08-2008)

# నాన్నా...!

నాన్నా!
నీవు లేని నా ఒంటరిప్రయాణానికి
అపుడే పదేళ్ళా...?
దశాబ్దంగా నీ స్పర్శలేని
నా గమనం ఎలా సాధ్యపడింది?
అయినా నీవు లేవనడం పైపై మాటే,
నన్ను నడిపిస్తున్న నాలోని నీవు, నీవే కదా!
సఫలవంతమయిన నా ఈ జీవితకాలదీపాన్ని
వెలిగించిన కాంతివి నీవే,
నీ జ్ఞాపకాలచెలిమె నుండే
నేను అనుబంధాలపంటను
పండించు కుంటున్నాను
నీ చూపుడువేలు కొననుండే కదా
నా ఊహలప్రపంచం కళ్ళు తెరిచింది
నీ మాటలపరిమళాల నుండేకదా
నాలోని సృజనాత్మకత పూవై విరిసింది,
నీ శ్రమమెట్లపై నుండే
నా సుఖజీవనసౌధం నిర్మితమయ్యింది
నీ అడుగులముద్రల వెంటే
నా వెలుగులబ్రతుకు తలెత్తింది,
నా కవితలో అక్షరాలు నీవె
నా పాటలో లయవు నీవే
నా మాటలో ఉనికివి నీవే
నా శ్వాసలో ఊపిరి నీవే
ఆనందమయిన నా కుటుంబం



నీ మంచితనపు ప్రతిబింబం
అప్రతిహతమయిన నా ప్రశంసలప్రస్థానంలో
ప్రతి స్థానం నీకే అంకితం
నన్ను 'కవి' అని గౌరవించడం కంటే,
నీ కొడుకని గుర్తించడమంటేనే నాకు ఇష్టం.
నీవు లేక దశాబ్దమే గడిచింది
ఇంకో శతాబ్దమయినా నిన్ను మరువం!!

(మా నాన్న కీ॥శే॥ ప్రహ్లాదరావు గారి జ్ఞాపకంగా...)

(నేటినిజం "సాహితీకెరటాలు" తేది 28-08-2008)